ఓఁ

ప్రతాయన్తాం వాచః నిమిత వివిధార్థామృతరసాః
నసాదః కర్తవ్యః కవిభిః అనవద్యే స్వవిషయే,
పరస్వాదానేచ్ఛా విరత మనసః వస్తు సుకవేః
సరస్వ త్యేషైషా ఘటయతి యథేష్టమ్ భగవతీ.

శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే
సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీ న్విషయా నన్య
ఇంద్రియాగ్నిషు జుహ్వతి.

మామిడి కొమ్మ మీద
కలమంత్రపరాయణు డైన కోకిల
స్వామికి మ్రొక్కి
ఈ యభినవ స్వరకల్పన కుద్యమించితిన్;
కోమల గోస్తనీ రుచులకున్
కదళీ ఫలపాక సిద్ధికిన్
లేములు తీర్చు మా తెనుగు
లేత ముదుళ్ళు వెలార్చు వేడుకన్.

పూర్వ లక్షణములు దిద్దు బుద్ధిలేదు,
అతి నవీనముల్ శాసించు నహముకాదు,
నవ్య కావ్య దృష్టిని చూపినాడ నంతె;
కలదుగాదె 'అనుక్తంబు' గ్రథనమందు.

ఆకసంబున మొలిచి అవ్యక్తనాద
భంగమయమయి, శ్రుతియయి, స్వరజటా క
లాపమై, వర్ణమాలయై, లలితశబ్ద
మయిన భాషాజగత్కళ కంజలింతు.

మనుజు డభిమత చింతనామగ్ను డగుచు
బహుముఖంబులఁ బెక్కుత్రోవలను నడిచె,
తన్నిరంతర దీక్షాసమున్నయమున
అందుకొనె శబ్ద సాధన మక్షయముగ.

సత్తపస్తప్తులయి ఋషీశ్వరులు తొలుత
తన్మయావస్థ నందిన దర్శనముల
కాద్య భాజనమయ్యె నయ్యమృత శబ్ద,
మధికృతస్వరసంహిత యగుచు పొదివి.

శబ్ద మవిభాజ్య సుస్వరచ్ఛందములను
దాటి రూపొందె సూక్త సూత్రములలోన;
తన్మహత్తర పదపాదతంత్రకలన
శక్యమయ్యె శతప్రాయశాస్త్రపంక్తి.

సుందరం బెల్ల శివమయి శోభజెందు,
శివమయం బెల్ల శాంతమై సిద్ధి నొందు,
సాంగ సుందర శివమయ స్వాదువయిన
కవి కళాకృతి శాంతమున్ శివము నగును.

వాసనా కర్మ నియతమౌ బ్రహ్మ సృష్టి
నందచందాలు సామాన్య మగుట గాదె!
ఇష్టరస రాగ భావనోద్దిష్టముగను
కవి సృజించె హ్లాదైక వాఙ్మయజగంబు.

క్రౌంచ మిథునానురాగ దారణము వలని
శోకమే శ్లోకమయి, యే మృదూకృతాత్మ
ముఖవియత్పథమున గంగబోలె వెడలె
ఆ వచస్వి ప్రాచేతసు నాత్మ దలతు!

సకల కళ్యాణవసతి యౌ ప్రకృతిలోన,
భావభాషాభినయము లైన ప్రజలయందు,
హ్లాదరామణీయకముల పాదు లెఱిగి,
కావ్యరతుడైన ఘను నెంతు కాళిదాసు!

# రమ్యాలోకము

౧

మూడుకోట్ల జీవత్కంఠముల అహర్ని
శల్ ప్రతిధ్వనించుచు, ఈ విశాల సుంద
రాంధ్రభూనభోంతర పరివ్యాప్త మయిన
అమృతశబ్దావతారము నాశ్రయింతు !

నన్నయాక్షర రమ్య ప్రసన్న ఫణితి
సోమయాజి అర్ధోన్ముక్త సునిశితోక్తి
పొదివి పోషింప, సర్వతోముఖ వికాస
భాసురంబైన కావ్య సౌభాగ్యమెంతు !

శోభలెగయు తారకల రాసులకు నడుమ
దర్శనీయమౌ క్షీరపథంబు పగిది;
దేశభాషా ప్రవాహ వీథికలలోన
తెనుగుపాయ రంజిలు తేనె తొనుకులాడ.

రమ్యాలోకము

ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో యిందు పుట్టినాడ!
కలదయేని పునర్జన్మ! కలుగుగాక
మధుర మధురం బయిన తెను మాతృభాష.

ఈ యనంత చైతన్య బృంహితమయిన జ
గత్తులో జన్మభూమి స్వర్గంబ యగును;
తద్వియోగంబె నరకబాధా ప్రవృత్తి
తల్లినుడి కంటె పరమామృతంబు లేదు!

ధర్మ మనుడు, యోగ మనుండు, తత్త్వ మనుడు,
ప్రాణి సాధింపగల పరమార్థములకు
తల్లిభాష ప్రధాన సూత్రంబ యగుట,
భాషకంటె నవ్యులకు తపస్సు లేదు!

అరవల పదాలంచు కొన్ని అంకిలించి,
కన్నడుల ముక్కలని కొన్ని కలవరించి,
ఆంధ్రభాషా సువర్ణ సస్యంపురాశి
తూరుపాలు బట్టు విపశ్చితులకు వినతి.

కలదు ప్రభుశక్తి భాషకు; బలిమి కలిమి
నాచికొని స్వీయకోశ కంఠప్రబద్ధ
ములుగ చేసికొన్న సువర్ణ పుంజములకు
అరవ కన్నడ యాజమాన్యములు కలవె ?

దేశమం దేమి, దేశసూక్తి నిధులందు
నేమి, పరవస్తు పదజాత మిమిడి యునికి,
తత్తదీయ పరాక్రాంతి దక్షతలకు
చిహ్నములుగ నవ్యులు విచక్షింతు రెపుడు.

సంస్కృతము లగుగాక, దేశ్యంబు లగును
గాక, పరదేశజము లగుగాక సూక్తు
లాత్మభాషా శ్రుతిస్థాయి ననులయించి
లీన మగును స్వస్థాన వేషానుకృతుల.

ధేనువులు తిను బహువిధ తృణచయమ్ము,
త్రావు నానానదీ కూప జీవనమును,
కలిసి పరిణమింపవె పాలుగా ధరిత్రి ?
శబ్దమేళన తంత్రనైజమ్ము నిదియె.

౨

కాల ధర్మానుగతమై జగత్ప్రవృత్తి
మాఱునపుడు వాఙ్మయమును మాఱు నిజము,
క్రొత్తనీరు తొల్కరియేళ్ళ క్రుమ్మిపాఱ
ప్రాతనీరు కలంగు టబ్రమ్ముకాదు.

ఋషులు శ్రుతిచేసి పాడిన ఋగనువాక
భాష నూని శాసింపడే పాణిని ముని ?
పిదప వార్తిక భాష్యముల్ వెలయవొక్కొ
ఉత్తరోత్తర సుప్రమాణోచితముగ ?

పరిషదభ్యస్త, మీశ్వర వాచనంబు,
శాస్త్రసాధన మయిన ఆ సంస్కృతంబు,
కవుల కుశలప్రయోగ గౌరవముకొలది
పరిణమింపదె మృదుకావ్యభాష గాగ ?

నిర్వికల్పక విజ్ఞాన నిరతులయిన
బ్రహ్మవాదులకును, హ్లాదరాగహృదయ
వాదులైన కవులకును భేదమెంతు ;
తారతమ్య మీమాంసకు తగను నేను.

ధాతు నిష్పన్నరూప బద్ధంబ యగును
సంస్కృతంబు, ప్రవాహినీ సదృశయగును
దేశభాష ; ప్రమాణ నిర్దిష్ట మొకటి,
ఒకటి స్వస్థాన నాగర కోపయోగి.

అజ్ఝలంతము లయిన శబ్దాళికెల్ల
నైజమగు పూర్వరూపము నాదమగును;
తత్తరంగవదాహతధ్వని విశేష
ములనె కలిగె సర్వస్వరమ్ములకు జన్మ.

నామవాచ్యము గాక అనాహతంబు
సంచరిం చంతరింద్రియ స్థానములను ;
అనుభవింతురు తన్మయు లయిన ఘనులు
ఏతదానంద ధారా సమృద్ధ శాంతి.

ఆహతంబైన నాద మారోహణావ
రోహణల వాచ్యమై శ్రవ్యమై హృదంత
రాళమందు రాగోదయమై లయించు ;
సుస్వర శ్రుతిమేళన సుఖము నొసగి.

తనుతర స్వరములకు అర్థములు లేమి
కేవల రసోపచారక క్రీడ లగును ;
కాని, లోక సంగ్రహ చోదకములు కావు,
దేహ సంహిత లేని యింద్రియము లట్లు.

విహిత వాగర్థశోభన వివృతికలన
శబ్దకాండ మనంతమై శాఖసాగె ;
అప్రధానార్థమై స్వర వ్యాపనంబు
కేవ లాలాపనామాత్ర కేళికయ్యె.

స్వరమయంబైన గీతికిన్, శబ్దబద్ధ
మయిన కృతికి భేదము నైజమగుట గాదె.
శిశుపశూత్సవప్రదమయి చెలగె గీతి,
కావ్య ముచిత సంస్కృతులకే గ్రాహ్యమయ్యె.

ఈ నిసర్గాంతరము చేతనే జగతిని,
కావ్య పద్య పాఠములకు కదల మెదల
నట్టి పసులు, వేణువు నూద నఱ్ఱులెత్తి
మెయి పులకరింప నాలించు మేతమాని.

రౌచికుండైన కవి రుచిర ప్రసన్న
పద మృదూపగూహన శయ్య బన్నగలడు
పద్యమందు గేయచ్ఛాయ ; ప్రౌఢమయిన
కృతికళ లసాధ్యమగు స్వరోద్గీతి యందు.

అనవరత తరంగప్రాయ మయిన స్వరము
గాయకుని కంఠధర్మవైఖరుల బట్టి
కటు మధుర భిన్నరుచుల వైకల్యమందు ;
సాధుశబ్ద మీ వైషమ్య బాధ గనదు.

ఈ యతీవ సూక్ష్మాంత రాన్వేషణమున
నాదగోళమున్ రెండు ఖండములు గాగ
చూచినాడ నంతియె ; ఉచ్చనీచ నిశ్చ
యము సలుపగాదు గీతి కావ్యముల నడుమ.

3

కావ్యమును, గీతియును, చిత్రకళయు, నరున
కబ్బిన యుదాత్త దివ్యాంశ లవనిమీద,
పఱుదశావరణముల నావలకు చాట,
తన్మయానంద మంద సాధనలు కావె !

దారు లోహ శిలా కల్పితంబు లయిన
విగ్రహాదుల సౌందర్య విభవమందు
వివిధ లావణ్య తారుణ్య విభ్రమములు
హత్తుక అపూర్తమగు శిల్పవృత్త సిద్ధి.

విన కనగలేని బధిరాంధజనుల కవని
సుస్వర ప్రతిమాములు శూన్యములగు ;
ఏతదభివర్ణనాపూర్ణ కృతుల నెలమి
చదువగల డొక, డాలింపజాలు నొకడు.

పూల కడుపులలో తేనె బోసె నెవడొ;
దాని తీయు నేరుపు తుమ్మెదకు ఘటిల్లె
భాషలోని మాధుర్య లావణ్యభావ
సాధు భోగము కవిముఖసాధ్యమయ్యె.

సృష్టియందె ఈశ్వరుని అర్చింత్రు కవులు,
శ్రుతికి మూలం బగును మాతృ సుస్వరంబు,
కావ్య గీతులు ప్రియసాధకములు ప్రాణి
కమలినానంద మొకడె లక్ష్యంబ యగును.

కలవు రసరామణీయకములు కృతులను
మాధురీ సౌరభమ్ములు మధువున బలె;
రసము లంతఃకరణయోగరంజనములు,
రామణీయక మాకర్ష రమ్యరచన.

స్వాదు మృదుపదసహవాస వాక్యరీతి,
గణసమాసంజిత మనోజ్ఞగతుల కలిమి
నందు చెలువమ్మె రామణీయకము కృతుల;
శ్రావ్య మగుచు నాకర్షించు ప్రాణితతిని.

ఖేదమోద ప్రసక్తులన్ భిన్నకుశల
దశలకు వశంవద మగుచు, తన్మయమయి
తన్మయ మొనర్చు సహృదయాంతఃకరణ ము
ఖోపభోగ్యమె, రస మన నొప్పు కృతుల.

కానవచ్చు సౌందర్య శృంగారములకు
అంతరం బనభివ్యక్తమయి ; ఉపాధి
గతము సౌందర్య - మనుపాధికము రసాధి
కారి శృంగార - మఖిలమంగల్యపరము.

రసరతంబైన హృది మకరందపాన
పరవశం బగు మధుకరావస్థ నందు;
తన్మహత్తర కైవల్యధారణాప్తి
కావ్యమందు ఆనందంబుగా స్మరింతు.

౪

కర్మమో జ్ఞానమో తదైక్యంబొ యగును
నరుని ధర్మార్థకామోపకరణసిద్ధి
వాగతీతం బనిరి దాని; వాగ్వ్రతు లగు
కవుల కది యెట్లు భోగ్యలక్ష్యముగ నొప్పు?

మంత్ర మహిమానుభూతి బ్రహ్మర్షి గణము,
నీతి బాహాబలస్ఫూర్తి నృపకులంబు,
నమ్మి విడిచిరే ప్రేమ సూత్రమ్ము; దాని
తడవరాదొ కాంతాసమ్మితముగ నేడు.

చెవికి చక్కెరపాటయై, చవికి చెలిమి
మురిపెముల మూటయై, చిత్తమునకు ముదిత
ముద్దులాటయై, లాలించి పొత్తుగొను ప్ర-
సన్న కావ్య మానందాభిసారికవలె.

మగధ సామ్రాజ్యమును ధరామండలమున,
మిథునశృంగారమును వచోమేరుతటుల,
హాలు డాదిగా నేలిరి; ఆంధ్రజాతి
కవుల తోబుట్టు వీ కావ్యకనకపుత్రి.

రసములకు నెల్ల శృంగారరసము తల్లి
యనిరి పూర్వులు సంభోగ మవధి గాక;
అక్షరానందసిద్ధి లక్ష్యముగ నెంచు
నవ్యులకు నది అప్రధానముగ మెలగె.

విషయమయమైన సంభోగ విధి జగాన
క్షయమయమ్యు రూపాంతర సంగ్రహమున
సుప్రజాతంత్ర నిర్వాహసూత్ర మగుట;
తలచెదరు దంపతీనిష్ఠ ధర్మముగనె.

మూఢు లిచ్ఛయించెదరు సంభోగసుఖము,
నే వియోగ మాధుర్య లీలావిపాక
మనుభవింప నఱ్ఱాడెద ననడె యాంధ్ర
రసిక కులరాజు పండితరాజు తరిచి.

ఇట్టి సౌందర్య మీ సుప్రకృతి ధరించు
బహు విధాల అనంతరూపముల నెపుడు;
రక్తినర్చింతు రభిరుచి క్రమముకొలది,
శిల్పులును గాయకులు కవిశేఖరులును.

కరుణ శృంగారములు రెండె కావ్యమందు
నిజ రసవిపాక భోగమందింప గలవు;
సహజపూర్ణ చిన్మయ సుఖాస్వాదనమున,
శోక మధిత మనోదోష శుద్ధికలన.

సృష్టికొక్క సుస్థాయి అభీష్టమేని
శాంతమగునది విషయ విశ్రాంతిమయము-
సంయమించిన ఇంద్రియ స్థాయిపదము-
సాహితీ రస పర్యవసాయి అదియె.

ఏతదమల సౌందర్యార్చనాతిరేక
మాత్మభావన నానందమై ఫలించు ;
జంతువుల జన్మవర్ధనాస్తమయములకు
ఆద్యసూత్ర మానందమే యగును కవికి.

చిన్ని నివ్వరి సిగవలె సన్నగా త-
ళుక్కుమన నాత్మకలజూచె నొక్క ద్రష్ట;
నవ్యతృణకంకణాభరణ ప్రయుక్తి
ప్రేమయోగ మొక్కండు భావించె నేడు.

కానబడ కనుమాన ప్రమాణమునకె
అంది యందని పరతత్త్వ మవలనుంచి;
పంచభూత భాసితమైన ప్రకృతి కళనె
సన్నిహిత లక్ష్యమనియె వచస్వి నేడు.

అందు నీ విలక్షణ జీవయాత్ర కోదవు
పృథివినే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి,
తల్లిగా, ధాత్రిగా, దేవతామతల్లి
గా సమస్త పరాపర కామ్యములకు.

౫

మండు టెండలఁ కాలి, అఖండ వర్ష
పాతముల బడి బ్రద్దలై, పంకసంకు
లంబయి, అతల కుతలమై, లవము విసువు
నొంద దీ పృథివీదేవి, యోర్పదెంతో !

కుమిలి క్రుళ్ళిన వస్తుచయము గ్రసించి
సుభగభూతిగా మార్చు నీ శుద్ధమూర్తి,
వక్షమున దాల్చి కొండల బరువుమోయు
కడుపుగోయు నాపగలను గారవించు.

ప్రాణులకు సరసాన్నముల్, వ్యాధులకు మ
హౌషధుల్, సుఖసాధన పోషణలకు
దివ్యఫలపుష్పఋతు కళా దృశ్యములు, స-
మృద్ధముగ నిచ్చుతల్లి నర్చింపరాదో ?

రమ్యాలోకము

పాములు విసంబు గ్రక్కెడు ప్రాంతమందు
జంతురక్తము పడ ఘాత జరిగియుండు;
పూలపాలు కాల్వలు గట్టు పొలములందు
పాడి యావులమందలు ప్రబలియుండు.

కోకిలలను వేటాడిన కాకులెల్ల
భూపిశాచ దుష్కంతులై పుట్టిరేమొ ?
పాటల ప్రవాహములలోన బడినవాళ్ళు
మృదుల కలభాషిణులుగ జన్మింపనోపు !

పైరగాలికి తలవంచి పసుపు మించి
ఉల్లసిలిన వెదుళ్ళు రూపొందె నేడు,
మందమకరంద హృదయంగమస్వరాను
కూల వీణారణన సూత్రకులము గాగ.

౬

నాదమూలము లగు మోహనపు కళలను
గాన కావ్యము లధిక రక్తంబులయ్యె.
స్వరమయము గీతి; కావ్యము భావమయము;
పదపదార్థక్రియాశాలి భావ మెపుడు.

భావగతి కవలంబన వాక్యమగుట,
వాక్యసంధాత కవియౌట వాఙ్మయమున,
శాబ్దికుడు ధూర్వహుండు కాజాల డెపుడు;
అవయవ విభాగమెటు లవయవిని దిద్దు ?

పంచభూత చిత్రితమౌ ప్రపంచ మరసి,
ప్రాణికుల మోదఖేద తత్పరత నలరి,
ఆపజాలని భావోదయము వెలార్ప
ననుకరించె వానిని స్వకావ్యముల సుకవి.

కావ్యముల్ త్రయీ మంత్రముల్ గావు, జన్మ
మోక్షసంధాన పరయోగములును కావు;
ప్రాణి యంతఃకరణవృత్తి భావమయ మొ-
నర్చి మృదులీకరించు ఆనందకళలు.

బహుజన ముఖోపచార సంపన్నము లయి
శబ్దకులము లుజ్జీవసౌష్ఠవము నందు;
కవులు వరియింత్రు సంప్రయోగముల వాని,
వార్తికానుశాసనము లావల ఘటిల్లు.

కావ్య భాషణాదికము వర్జ్యమని ఆంక్ష
పెట్టినారు తత్త్వవేత్త లెపుడొ !
దాని మాప దీర్ఘ తర్కంబులను బెంచి
లలితదృష్టి విడిచె లాక్షణికుడు.

కవికి తాత్త్వికునకు కయ్యంబె సాగెను
బహుదినాలు వాక్ప్రపంచమందు,
రాగరక్తు డొకడు, రాగముక్తు డొకండు;
సగుణ నిర్గుణముల సఖ్యమెట్లొ ?

## ౨

"హృద్యమై, రసమయమైన, ఈ యపార
కావ్య సంసారమందు సుకవి యొకండె
బ్రహ్మ; ఏతదభీష్ట ధారా తరంగి
తముగ అనురణించు సుమి శబ్ద ప్రవృత్తి."

భిన్న పరిమాణ వర్ణసంపన్నము లగు
గణగణ నిబద్ధ వృత్తవాక్యముల కొూదవు;
అశిథిలారోహణావరోహణల యందు
స్వరవళుల కబ్బు రాగసౌభాగ్యరక్తి.

అభినయమున, గ్రీవాభంగహస్త భరణ
భ్రూకటాక్ష విక్షేపాది ముదిత కలన
లాస్యవతి కబ్బు సొగసువాలకము బోలు;
వృత్త విన్యస్త శబ్ద ప్రవీణచేష్ట.

రమ్యాలోకము

మృదుల సరళాక్షరముల సంమేళనమున
ఆర్ద్రనవనీత మార్దవమందు నుడులు
శ్రవణసుఖ మిచ్చు సులలితోచ్చారణమున,
భంగిమ యటందు రీ పదబంధసరణి.

ఈ పలుకుబడి తీపిఘటిల్లె తెనుగు
భాషకు నిసర్గమోహన భూషణముగ;
మధురస ధురీణమయిన సుమమ్ము నకును
అందమగు రంగురేకుల పొందికవలె

పదల రీ వృత్తపద మృదుబంధ మెందు
నవ్యలు రసవద్వాక్య సంధానమందు;
సంధులు విసంధులైనను, సాంస్కృతములు
దేశ్యములతోడ సమసించి, తీవె గొనిన.

సుప్రసిద్ధ దేశ్యంబులన్ శుద్ధసంస్కృ
తములతో కల్పదగు సంప్రదాయ మనదె
వామనుడు ? శ్రవణ సుఖంబు పాయదేని
అవిరళింతు రీ భంగిమ నాధునికులు.

సంస్కృతము తల్లి యెల్లభాషలకు నండ్రు
ధాత్రియందు ; ఈ తల్లి యుత్తమ సువర్ణ
వైభవమును సంతానంబు పంచుకొనదె ?
జన్యజనక బాంధవ విశేషముల కొలది.

శ్రుతిహితం, బుదాత్త స్వర స్ఫురితబంధ,
మయిన సంస్కృత భాషాప్రియ ప్రసాద,
మార్ష ముఖరుచి మద్వరేణ్యంబ యగుట
ఏల బిడ్డ లాస్వాదింప మైలపడును !

ఆ సరస్వతి ము న్నదృశ్య యయిపోయె
నండ్రు ; భావింతు నేను తదమృతజీవ
నము సమస్తము భాషాస్తనంధయముల
కిచ్చి, తాను కృశించిన దేమొ యనుచు.

అన్యదేశ్యంబులను, ప్రాకృతాది సరళ
వాఙ్మయస్థ శబ్దంబులన్, పాటెరింగి
నుడికరింతురు జాను తెనుంగునందు ;
మధురి మార్ధ గౌరవముల్ ప్రమాణములుగ.

ఇరుగు పొరుగు సీమలలోన మెఱుగులొలుకు
పలుకు లను జాతిసానల పలకదీర్చి,
తెనుగు బంగారుతీవె సూత్రింతు రెలమి,
చేతనాహ్లాదరమణీయ శిల్పి రచన.

పాలలో వెన్న లీనమై క్రాలు లీల
శబ్దమందు అర్థంబును చక్క నెసగు ;
ఒకటి యాస్వాదనీయమై యుత్సవించు,
ఒకటి హృదయంగమంబుగా నుపకరించు.

ప్రాతవయినంతనే త్యజింపరు, నవీన
మయినమాత్ర వరింపరు ; ప్రియములై స
హృదయ సేవ్యమానములైన వెల్ల, స్వీక
రించి భావాంబర మలంకరింతు రర్థి.

చిర యశఃస్థాయి గొనిన ప్రాచీన సుకవి
వాఙ్మయమునందు ఆకర్షవంత మయిన
రమ్య భావకలాపము౯, శ్రావ్యమయిన
శబ్దరీతి విధానమున్, సంగ్రహింత్రు.

కాని, వారల వలెనె అఖండమైన
సృష్టి వైచిత్ర్యమును, ప్రాణిచేతనా వి-
కాసమును, స్వతంత్రముగ లక్ష్యమున నిలిపి
స్వానుభవ భాష్యములు విప్ప సాహసింత్రు.

"ప్రాతగిలిన మాత్రాన భవ్యములు కావు
నవ్యమైన మాత్రాన నింద్యములు కావు"
అందచందము, లభిరుచి ననుసరించు
దేశ కాల పాత్రానువర్తితము లగుట.

వాణి వాయింప మ్రోగిన వీణ మీద
పారసీక గీతంబులు పలుకమనెనె!
ఋషుల నీవారములు ఫలియించినట్టి
పొలములందు గులాబీలు పూయమనెనె!

చోద్య చోదక సామర్థ్య సూత్రమయిన
వాక్కుచే విలక్షణులైరి ప్రజలు; అందు
సుకవి కంఠము ఛందోవిశుద్ధి నంది
శబ్దసంమేళన క్రియాచతురమయ్యె.

## రమ్యాలోకము

శ్రవణ దారణములు, శిరీష ప్రసన్న
భావ బాధకములు, రసభంజకములు,
నైన విషమశబ్ద స్నేహ మనుఘటిల్ల,
దమృతమయమైన సుకవి సూక్తమున నెపుడు.

ప్రాతసొమ్ములు కరిగించి పసిడి తేర్చి,
క్రొత్త నగలను చేయించుకొనరె జనులు ;
సోమలతల రసఁబు విశుద్ధమగును
గాక, చిన్ని పూదేనియల్ కటువు లగునె !

౯

సరసచైతన్య రంజిత జగతియందు,
కవి గ్రహింపగరాని వస్తువులు కలవె ?
రాళ్ళ నేడ్పించు పచ్చివిరహుల పగిది,
ఏళ్ళచే జోల పాడించు తల్లు లట్లు.

తీవెమీద సుతారంపు తీవి నిలిచి
పగలబడి నవ్వు పువ్వుపై కెగయు అళిని;
ప్రియుడు ప్రియురాలినట్లు చేర్చె నొక సుకవి
బిడ్డ తల్లిని ధాతికల్పె మతొకండు.

కూయు కోకిల రవళికఁ గుఱుతుపట్టి
పంచమశ్రుతి నరు డభ్యసించె నిజము;
సహజసిద్ధంబ యది పికజాతి కెల్ల
మహితయత్నసాధ్యం బాయె మానవునకు!

## రమ్యాలోకము

ద్యుమణి తన చిత్రరుచు లదృశ్యముగ విమల
పుష్పపత్ర ఫలాళిలో పోయురీతి;
సుకవి వాగర్థబాంధవ స్ఫోటరక్తి
స్వరలతాంతములైన శబ్దముల నించు!

శుభవయోరాగ మంగళ్య సుభగమయిన
కులవధూముఖవర్చస్సు కొలిచె నతడు;
శతదళోత్ఫుల్ల శోభా ప్రసాద సాధు
మాధురీ పూర్ణమయిన పద్మంబుతోడ.

ప్రొద్దుప్రొద్దుల పూచు తమ్ముల మొగాల
దినకరుడు రావిరేకలు తీర్చెననియె;
పగ లెఱుంగని కన్నె కల్వలకు చంద
మామతోడ చీకటిచెల్మి మంతరించె.

"నీరు తీసిపోయిన తటినీతటముల
పొరలుపడ్డ యిసుక మడపులను చూచి,
పానుపును వీడి లేచు భామానితంబ
గళిత సిత దుకూలాంచలముల స్మరించె."

మట్టిలో బడ్డ బీజము మంజుకుసుమ
బంధమై చెలువారు సంబంధ మరసి,
అతి మలీమసగర్భ సంపతిత బిందు
వద్భుతాకృతి గొను రహస్యములు పోల్చె.

కడుపునఁ గన్న సుతు సమక్షమున గూడ
పైట జాఱనీయని తల్లివరుస నరసి ;
తీర్చె స్త్రీ పురుషుల ప్రేమ తీర్థసేవ
నౌచితీపారములుగ కావ్యమున సుకవి.



చివర మొదలును లే కవిచ్ఛిన్నమైన
కాలమంత వసంతమై, కఠిన దీర్ఘ
దివసమై, దుర్దినంబయి, దివ్య శరధి
యై, హిమార్ద్రమై, శిశిరమై యాడె నెదుట.

తూర్పు కొండ పొలాన ఒత్తుగను మొలిచి
పొడవు పెదిగిన కుంకుమపువ్వు గోసి,
ఏడు గుఱ్ఱాల శకటాన నెత్తిత్రోలు
మిత్రు డొక్కఁ, డాశలు సొంపుమీఱి మెఱయ.

తూలు తమ్ములు నిదురింప జోలపాడి,
మేలుకొను కల్వలకు వేడి పాలు పోసి,
నిశికి నునుపారు కురుల నూనియలు పూసి,
సందుగొందుల బడి జాఱె సందె ధాత్రి.

తెల్లచుక్కల కరియాల నెల్ల పిదికి
పయి నిడిన క్షీరభాండంబు పగిలినట్లు;
వఱదగట్టెను బ్రహ్మాండ భాగమెల్ల
పచ్చివెన్నెల పాలయి ప్రాణులలర.

సందె కోపించి రక్తము చిందులాడ
సాగిపోయె నావలకు ఆశలను విడిచి;
చుట్టుకొన్న ఆ తమిలోన సురిగిపోయె
విఱుపు లందిన బొమ్మల మురిపెములును.

నా మనోరాగమే వసంతమున కాంత
లసదరుణ పల్లవము లయి మిసమిసాడె;
పంచమశ్రుతి రతిని జీవములు తనియ
చక్కమ్రోయించె కలకంఠ జంత్రములను.

మధుపరాయణమయి రక్తి మరగి, రాగ
భోగముఖమున సోలిన భూమినెల్ల
తప్త మొనరించి, జాడ్య ముక్తముగచేయ,
కఠిన శిక్షాకరుం డయ్యె కర్మసాక్షి

ఆ తపంబు నార్ద్రాంబర మద్దుకొనగ
కడల మెఱుగుల యలకలు జడలు పడగ,
నిలిపి షడ్జశ్రుతిని, వన్నియల నెమిళ్ళ
నాట్యమాడించె నెల్లెడ నాదు వలపె!

కట్టువడి, దుర్దినాలలో కాలు బయట
పెట్టని పయస్వినులకు లభించె మరల
స్వాదువయిన శాద్వల పత్రపారణంబు
నాతి శుష్కపంక సరి దుపాంతములను.

శాంతముగ నూర్ధ్వలోకవాసమున మెఱయు
శుచిముఖకులంబు సంక్రాంతి సోమతీర్థ
మరయ దిగినట్లు హిమతారకా కృతులను
నిండె నులాసమయ మహీమండలమున.

పరమ వైఖానసులు పురాపాపకర్మ
సంచిత విముక్తు లగునట్లు, సకల జీర్ణ
పటలముక్తులయిరి వనస్పతులు గూడ,
బలవ దవసాన ఋతు పరిపాక సిద్ధి.

౧౦

ఉత్తరోత్తరోత్పతన సముత్సుకు లగు
కవుల కంఠము సూక్ష్మాంబర వివృతమగు ;
సహృదయాకాంక్ష కలిమి నా ఛాయలెల్ల
అల్ల నల్ల నున్ముక్తమై అభిరుచించు.

ఆకసమునందు తారల నడుగవలయు
భామ యంతఃకరణ రక్తభావములకు ;
పల్లవ స్నేహమున నెట్టబడిన నవ ర
సాలము లెఱుంగు ఆ జవరాలి గోడు.

పాలు పిదికెడు రాత్రి ముత్యాలు మునిగి
తేలి యాటలాడగ కాల గోళకమున ;
బాంధవీ, నీ ప్రణయపక్వ పాయసమును
ఆత్మనై వేద్య మిడ నిది అదనుగాదె !

యమున చూడని కొౙత గోరంతలేక
తీఱె నా కిష్ట మదిరాక్షి ! తేటలారి
గంగయై, తామ్రపర్ణియై, కడకు కడలి
యై పొరలు నీ కటాక్ష శిక్షానుభూతి !

చద లలికి, అందముగ చిఱుసన్న రంగ
వల్లికలు తీర్చినట్లు రంజిల్లె తార ;
లంతరమున తోచె శశి సంక్రాంతినాడు
పాలు పొంగింప పెట్టిన భాండమట్లు.

ప్రియు కటాక్షించు సతి యరవింద సదృశ
లోచనముల ఘూర్ణిలు రాగ వీచికలును
తనిసెడు అపత్య కామ సాంత్వనమునందె,
కొమ్మ కళుకులు ప్రసవమై కుదిరినట్లు.

"ప్రకృతియందు రమ్యము కాని వస్తుతతిని
చిత్రకళలు రమ్యముగ తీర్చెడిని"; కాన
హ్లాద రమణీయ కల్పనాపాదనమున
అపసరింత్రు మలిన జుగుప్సాదు లెపుడు.

"రమ్యచిత్రాళి గని, మధుర ప్రసన్న
సూక్తు లాలించి, ప్రాణి యౌత్సుక్యమందు ;
తదుపలాలనార్ద్రిమగు చేతమ్మునందు
స్మరణ కెక్కు జన్మాంతర సౌహృదములు."

హేయములు క్లీబములు జుగుప్సాయితములు
రమ్యములు గామి శిల్పదూరంబు లగును ;
జ్ఞాపన జ్ఞేయ విజ్ఞానశాలియయిన
నరున కెటుచాలు విషకృమి న్యాయవృత్తి ?

ధూమదూషిత దుర్గంధధామ వసతి
రాచిలుక మాలకాకియై నీచగిలును !
దుర్భయానక ఘృత్యదధోగతి ప్ర
సక్తిమెయి భావనకు స్వవర్చస్సు తొలగు.

భ్రమరముఖ కబళితమైన పచ్చపురుగు
ప్రమదషట్పదియై గీతకములు పాడు,
ప్రియకలాప రమ్యాలోకమయిన కావ్య
రక్తహృదయ మానందధారణ రమించు.

రమ్యాలోకము

పచ్చి ముత్యాల తమ్మి పూబళ్ళెరమున
తళుకు లఱమోడ్పు గొను జంటకలువ లమర;
జాలు లతికల, విశద మంజరులతోడ,
చెలియ తోఁచె భోగార్చన సలిపినట్లు.

అద్దముల నారబోసిన యాణిముత్య
ముల విధాన చుక్కలు పలపల నెసంగె;
అల్లనల్లన జరుగు శ్వేతాంబరంబు
కలశములమీద చక్కగా కప్పు మబల !

చతుర పరకీయ నాయికా సాహచర్య
సుఖ ముపాదేయమగు ; అన్యశోభనోప
వన సుమం బట్లు హృదయ సేవనకు మాత్ర,
మందరాక, ఆనగరాక, పొందరాక.

సహచరీ వయో విద్యుదంచల పయోధ
రముల నరసె సంమోహన భ్రమలు మున్ను
నేడు లక్షించె సుకవి వినిర్మల ప్ర
సూతికా స్తన్యధారాభిసీత రుచులె.

౧౧

కావ్యమందు నిర్దిష్టార్థ కలనకంటె
రసవ దిష్టార్థమే పరిగ్రాహ్య మగుట,
కవివచోవైఖరియు, రసజ్ఞప్రసాద
నవనవస్ఫురణయు, ప్రమాణంబు లిందు.

సరసకావ్యార్థము లభిధావరణ మెడలి
లక్షణావ్యంజనా వీధులన్ భ్రమించు;
పూవు విడిచి వాయుతరంగముల నపార
దూర మేగెడి పరిమళ సారమట్లు.

సకల మానవసంతాన సహజమైన
తను విభావానుభావ బంధమును, అనుక
రించు శ్లోదైక రమణీయరీతుల కృతు;
లానుషంగిక మం దితరాంశ చర్చ.

శీల మట్టుల నౌచితిఁ జెదరనీక,
అహివిధాన నశ్లీల మనాదరించి,
ప్రేమసూక్త మహోపాసనా మయు లగు
నవ్యుల కుపాధియయ్యె సౌందర్య మొకటె.

కళలు రమ్యార్థ సౌభాగ్య కల్పనములు
సంవృతమ్ములు శాస్త్రబీజమ్ములందు ;
మధుర కందరసార మాంసలము లయిన
పండ్ల లోపల విత్తులభంగి నంతె.

భావ సంపన్నమయిన కావ్యమున, భగ్న
భాగ్య బీభత్స పిండనపర్వ మేల ?
కాయగూరల క్షుత్పీడ మాయగలదు,
చిత్త శోభాపిపాస నే శీధు వార్చు !

క్షీరము దధియై వెన్నయై ఘృతమయి సుఖ
సేవనల కగు శుచిరుచి శేషమగుచు ;
కటు కఠోర కరాళ కంకాళ కృచ్ఛ్ర
కశ్మలాదులు తీర్చు నే కామ్యములను.

ఈ విలక్షణ పరిణామ మెఱిగి కాదె
రుచిమ దిష్టార్థదోహన ప్రచురశబ్ద
సరమునే కావ్య మనియె ఆచార్యదండి;
లక్ష్యలక్షణ సమవాయ లాఘవుండు.

రసము లుదయించు వస్త్వంతరములు భిన్న
మయ్యు రుచి నభేదప్రాయ మగును తుదిని;
పాలలోన చెఱకులోన పూలలోన
పుట్టియును, మాధురియె అనుభూతి కాదె.

హాస భాషావలోకనోల్లాస రూప
చేష్టితముల సౌందర్యమాసించు నిజము,
ఏత దనువర్తనోత్ఫుల్ల రీతులెల్ల
నెలవు లగును శృంగారముఁ నిలఁవరింప.

విప్రలంభసంభోగముల్ విస్తరించి,
సంగ్రహించిరి శృంగారశాఖ లయిన
స్నేహవత్సలాదుల; నతిస్నిగ్ధహృదయు
లగు కవుల కిపుడవి వరేణ్యంబు లయ్యె.

రమ్యాలోకము

లాలనీయమౌ శిశువు వాలకమునందు
సమసుఖార్తి భాగినియైన సఖిముఖాన
ద్యోతమయ్యెడు అవితథయోగమై స్ఖ
లింపని ప్రసన్న శృంగార లీథరేఖ.

తల్లి వక్షఃస్థలంబున స్తన్యమాని
నిరవధికతుష్టి విశ్వమే మఱచు శిశువు
క్షీరకోమల గండశృంగార చుంబ
నముల నొదవెడు తల్లికిఁ బ్రమదపులక.

బలవదమలానురాగ తపఃప్రభగ్ను
డయిన సఖుని ఆశాదీప మాఱకుండ,
తన నయస్నేహ శృంగార ధారబోయు
పరమసౌందర్యనిధియైన ప్రాణసఖియు.

స్నేహ సురత వాత్సల్యముల్ జీవితమున
ప్రేమ కంగంబులగు, అంగి ప్రేమ యొకడె;
ప్రేమ శిఖరావరోహణాభిజ్ఞు లయిన
మృదు సహృదయుల కివియెల్ల మెట్లుగును.

## ౧౨

నాయికా నాయకులలోన నాయికయె స
మగ్ర చరితార్థయగును రసార్చనమున,
తన వయోదానమున ప్రసూత ప్రసాద
మంది పునరభిరంజనల్ పొందుకతన.

భోగ సోపాన మెక్కిన రాగవతులు
స్తన్యమోహనమగు స్తనంధయ సతల్ప
చుంబనోపగూహన మహౌత్సుక్యములను
ఆసగొనరె? పూర్వావస్థ నందరామి.

అవిషయము, లకలంకము, లక్షతములు
అనవగీత కౌమారములయిన సుఖము,
లనుపభుక్తము లగుగాదె వనిత కెందు?
యౌవనోద్వాంత రతి సమయాంతరముల.

రమ్యాలోకము

సురత సంస్పర్శలేని ఈ శుచి మదమల
జీవితానురాగాదులన్ చిలకరించు
కానరాని శృంగార ; మాకర్షణ ప్ర
భావ విమలోపచార సుఖావహముగ.

ఇంతలేసి కాటుక కన్ను లెదురుకోలు
నందుకొనగ, పువ్వుల బంతులాడ నవ్వ ;
మార్గమడుగ బిత్తరవోయి నిర్గమించు
గ్రామకన్య వాలకము శృంగారమందు.

స్నానమాడి, పెన్నెరు లఱజాఱ ముడిచి
నొసల కుంకుమ, పాదాల పసుపు మెఱయ,
క్షీరశాటి తాలిచి తులసిని భజించు
ధీర రూపము మాతృ శృంగారమగును.

శుభకళా కాంతి లక్షణ స్ఫోరకమయి
విలసదభినవ సౌందర్య బింబమయిన
పుత్ర శృంగార, మాకర్ష పూర్ణమగుచు
లాగదే ముద్దులాడ నెల్లరను జగతి ?

కళలు కుసుమింప, రూపురేకలు రుచింప,
పలుకులు నయింప, ముదితచేష్టలు హసింప,
జగదధిష్ఠాన సుందర స్వామిని వలె
నొలయు చెలియ బ్రహ్మానంద సోదరి యగు.

స్థాయి రతిలేని బహ్వావస్థల రుచించు
అప్తశృంగారమును భావమనిరి ; కాని
మూఢమగుటయు రసము సంభోగమున, వి
యోగమందు ఉవ్విళ్లూర్చి లాగ గనమె.

పార్వతీ పరమేశ్వర బాంధవమున,
భారతీ బ్రహ్మదేవ దాంపత్యమందు,
విషయ సురత ప్రసక్తి భావింపగలమె ?
రస మనౌచిత్యమున మలీమసమయమగుట.

యామినీ చంద్రులకు మిథునానురక్తి,
పద్మినీ మిత్రులకు వధూవరుల వలపు,
గారవించిరి కవులు శృంగారకృతుల ;
సురత మేది ? ఆ ప్రకరణాంతరములందు.

## రమ్యాలోకము

రమ్య సౌందర్య లహరీ తరంగళయ్యె
నీ యలౌకిక శృంగారమే స్ఫురించు,
సదమలంబయి పూర్ణమై సహజమైన
మాతృ శిశుబంధ మధుర ధర్మమును నిదియె.

ఏకదేశ నిష్ఠంబైన ఈ యమేయ
దివ్య శృంగారమునె గుఱితింత్రు నేడు
నవ్య కవికులపుత్రు; లనంతమయిన
ప్రకృతి యందును మానవ ప్రకృతియందు.

భువన సంమోహనుండైన పురుష నరసి
'ఇతని కిచ్చిన తల్లి యమృతకలశము
లెంత ధన్యములో' యని నిచ్చమెచ్చు
సతుల నెఱుగ మెందఱిని వాత్సల్యరతల.

అతి బలాత్కార రక్తలై, యదు కిశోరు
పరమ సౌందర్య మహిమ కవశ్యలయిన ;
గొల్లభామల లీలలన్ గోచరించు
నీ యబోధశృంగారమే యిగురువోసి.

## అభినవ కవితాకృతులు

తృణకంకణము

కష్టకమల

స్నేహలతాదేవి

తెనుగుతోట

స్వప్నకుమారము

ఆంధ్రావళి

జడకుచ్చులు

మధుకలశము

మాధురీదర్శనము

రూపనవనీతము

*

**RAMYA LOKAMU**

**BY**

**RAYAPROLU SUBBARAO**

*Re. 1/-*

అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.